**BANDA BAIRAGI**–HISTORICAL PLAY IN TELUGU

By Dr. OGETI ACHYUTA RAMA SASTRY, Rastrakavi

---



First Edition 1959
Second Edition 1992

Copies Available at

Dr. OGETI ACHYUTA RAMA SASTRY, *M.A, PhD.*
8-2-46, Sri Nagar Colony Road
panja gutta (pratap Nagar)
Hyderabad–500 482, A.p. India

price Rs. 12/-

printed at

Dakshina Bharat press
Khairatabad, Hyderabad.

# ప్రథమ రంగము

కాలము-క్రీ.శ. 1636

సమయం-ఉదయం-పది గంటలు

స్థానము

కాశ్మీరమునందలి పూంఛ్ జిల్లాలోని రాజౌరి గ్రామమునకు దాపున గల అరణ్యము.

(ధనుర్బాణములను ధరించి లేడిని వెంబడించుచు రాజాలక్ష్మణదేవు ప్రవేశము. వయస్సు ఇరువది సంవత్సరములుండును.)

లక్ష్మణ : హరిణమా! ఆగుమాగుము! ప్రొద్దుటి నుండియు, వేటాడుటకు నొక్కమృగమైనను తారస పడక వేచి వేచి విసిగి వేసారితిని. ఇంత సేపటికి లభించిన నిన్ను వేటాడక విడువను, నిలుము! నిలుము! (బాణమును విడుచును)

(తెఱలో) : అయ్యో! వలదు! వలదు! ఈ లేడి గర్భిణి! దీనిని వధింప వలదు; వధింపవలదు !

లక్ష్మణ ; ఓయీ ! ఏమంటివి ! యీలేడి గర్భిణి యనియా ! -అయ్యో! యెంత తొందరపడితిని !

ఒకడు : (తన బాలునితో ప్రవేశించి) అయ్యా, యెంతపని చేసితివి! వలదనివారించినను వినక తొందరపడి గర్భిణియగు లేడిని, నాపెంపుడు కూతును అన్యాయముగ హతమార్చితివే!నీ బాణహతికి

దాని గర్భము పగిలి అందుండి వెలువడిన రెండుకూనలతో సహా అదెట్లు గిలగిల తన్నుకొనుచు నెత్తుటిమడుగులో చచ్చిపడి యున్నదో వచ్చి చూడుము: (అవాక్కై, నిశ్చేష్టుడై నిలబడిన లక్ష్మణదేవుని వెంటనిడుకొని నిష్క్రమించును).

బాలుడు : (తాను కూడ వారి వెంట రెండు మూడడుగులువేసి, ఆగిపోయి, ఒకనిముషము మౌనముగ నటునిటు తిరుగుచు, దుఃఖమును దిగమ్రింగుకొనుచు) అది మా యింటి పెంపుడులేడి.... నాకు చెల్లెలు వంటిది...ఇకనుంచి నేనెవరితో నాడు కొందును!.... దేవుడు ఈ ధనుర్బాణములను సృష్టింపకున్ననెంత బాగుండెడిదో!....సృష్టించినను వాటితో యే సింహమో, పెద్దపులియో వంటి క్రూరమృగములను చంపవచ్చునేమోగాని....అమాయికలైన లేళ్ళను చంపుటయా! ....ఈ వేటగాడు తన ప్రతాపమును అప్పుడప్పుడు మా గూడెముపై వచ్చిపడుచు మమ్ము చిందర వందర చేయుచున్న ఆ తురకల దండుపై చూపింపవచ్చును గదా; బుజ్జి బుజ్జి లేడి కూనలపైననాచూపించుట!....అదుగో, ఆతడు మరలనిటేవచ్చుచున్నాడు. ఇకనేనిచ్చటనుండరాదు. త్వరగా నింటికిపోయి యీ విషయమును మా అమ్మకు చెప్పెదనుగాక (అని వెళ్ళబోవుచు వెనుకకు తిరిగి లక్ష్మణదేవునకు వినబడునట్లు) ఎట్లయినను ఆతనికి ఈ లేడికూనల ఉసురు తగులకపోవునా యేమి? (అని పలికి, లక్ష్మణదేవు అతనిని ఆప్యాయముగ అంది పుచ్చుకొనుటకు నుంకించుచుండ అందకుండ తప్పించుకొని నిష్క్రమించును).

లక్ష్మణ : (ఆ బాలుని చివరి మాటలను మఱల తాను నెమ్మదిగ నుచ్ఛరించుచుఆదొకశాపముగ భావించినట్లు అభినయించుచు కొంతవడికి) అకటా! యెంతటి యకార్యమాచరించితిని. ఆ నెత్తుటి మడుగులో ఆ తల్లియు పిల్లలును తెగిపడిన దృశ్యము మాటి మాటికి కళ్ళకు కట్టినట్లు కాన్పించుచు, ఎంత ప్రయత్నించినను మఱపురాక గుండెలకోత వడుచున్నవే! ఈ ధనుర్బాణములతో మును పెన్ని జీవములను వేటాడలేదు! వేట క్షత్రియోచిత మనియు. శరీరమునకు చక్కని వ్యాయామ మనియు, యుద్ధములందు శత్రువులను గుఱితప్పక హతమార్చుటకు కావలసిన నైపుణ్యమును సంపాదించుకొనుట కొక మార్గమనియు భావించి గదా రాజులందరు ఆ బాల్యము ఈ వ్యసనమునకు బానిసలై వర్తించు చుందురు! కాని....ఈ సంఘటనతో....అబ్బ! యిప్పటి వఱకు సాగించిన జీవహింసను తలచుకొన్న కొలది....ఒడలు జలదరించి నాపై నాకే యేహ్యము కలుగుచున్నది. (ఇటునటు తిరుగుచు విషాదము నభినయించుచు, సాలోచనముగ) ఇంతటితో ఈ హింసా ప్రవృత్తికి-పశు ప్రవృత్తికి స్వస్తి చెప్పవలయును. అంతేగాదు; ఇక నుండి యీ ప్రాపంచిక విషయములకు దూరముగ, వైరాగ్యమును వరించి జీవించుటమేలు!....ఔను! వైరాగ్యమును వహించి జీవించుటమేలు (ఒక్కక్షణ మాలోచించి) ఇక నీ ధనుర్బాణములతో నాకేమి పనియున్నది! (అస్త్రసన్యాసము చేయును) నేటి నుండి యీనాచేతికి నలంకారము ధర్మదండమే గాని రాజదండము కానేరదు. ఒకవేళ రాజదండమునే ధరింపవలసి వచ్చినను అది ధర్మదండమై వెలుగొంద వలయును....(నిష్క్రమించును).

# ద్వితీయ రంగము

కాలము—క్రీ.శ. 1687

సమయం—ఉదయం—పదిగంటలు

స్థానము-రాజౌరి గ్రామము

(రాజా లక్ష్మణదేవు కొన్నాళ్ళు మనశ్శాంతి లేక ద్రిమ్మరియై తిరుగుచు ఒకరోజు రాజౌరీకి వచ్చిన జానకీ దాసు అను ఒకానొక బైరాగిని కలుసు కొనును. ఒకవైపున జానకీ దాసు ఒక చెట్టుక్రింద కూర్చొని ప్రకృతిని పరికించుచు పరధ్యానముగ నుండును. మరోవైపున లక్ష్మణదేవు ప్రవేశించి ఆతనిని ఒక్క నిముషము పరిశీలించినట్లు చూసి)

**లక్ష్మణ:-** (తనలో) ఈసాధువెవ్వరో గాని నన్ను మిక్కలి యాకర్షించు చున్నాడు....ఈతని నాశ్రయించి నాకు మనశ్శాంతిని ప్రసాదంప గల మార్గము నుపదేశింపుమని వేడుకొందును గాక, (సమీపించి) స్వామీ! ప్రణామములు.

**జానకీదాసు :-** (పరధ్యానము నుండి తేరుకొని) మనశ్శాంతిరస్తు ! ఇష్టార్థ సిద్ధిరస్తు ! కీర్తి ప్రతిష్ఠా ప్రాప్తిరస్తు!

**లక్ష్మణ:-** (తనలో) ఈతడాశీర్వదించిన విధానము, ఒకదానికంటె నొకటి విలక్షణముగనున్న ఆయాశీర్వచన వాక్యములు నన్ను మరింత లోగొనుచున్నవే ! ముఖ్యముగ 'మనశ్శాంతిరస్తు' అని దీవించుట ఆశ్చర్య కరముగ నున్నది! నా మానసిక స్థితిని గూర్చి యీతడెట్లూహించెనో గదా! (ప్రకాశముగ) స్వామీ!....

జానకీదాసు:- వత్సా! అర్థమైనది....నీ సందేహ మర్థమైనది. నీవు మన శ్శాంతిని కోల్పోయి తిరుగుచున్నట్లు నేనెట్లూహించితినో యనియే గదా నీయాశ్చర్యము!

లక్ష్మణ:-(తనలో) ఇది మఱియొక ఆశ్చర్యము! ఈతడెవ్వరో గొప్ప యోగివలె కాన్పించుచున్నాడు, నామనస్సునే చదువుచున్నాడే! (ప్రకాశముగ) స్వామీ! మీరు సరిగా నూహించితిరి....తమరు....

జానకీదాసు:- వత్సా! నన్ను జానకీదాసందురు. దేశాటనము చేయుచు, వివిధ పుణ్య క్షేత్రములను సేవించుచు ఇప్పుడీ గ్రామమున విడిది చేసితిని. మఱినీవు...

లక్ష్మణ:-స్వామీ! నాపేరు లక్ష్మణదేవు....ఒకనాడు నేనొక గర్భిణియగు లేడిని వేటాడితిని. దాని గర్భమునుండి వెలువడిన రెండు పిల్లలతో సహాఅదిమరణించిన విధము ఎంత ప్రయత్నించినను మరపురాక నాగుండెలను పరిపరి విధముల కుళ్ళబొడుచుచున్నది.అందువలన జీవితముపై విరక్తి గలిగి మనశ్శాంతికై యిటునటు పరువులెత్తు చున్నాను. మీరెవ్వరో గొప్పయోగివలె కాన్పించుచున్నారు. నాకు చిత్తశాంతిని ప్రసాదించుమార్గమేదైననుపదేశింపుడు.

జానకీదాసు:- నాయనా! భగవల్లీలకడు చిత్రముగనుండును. ఆయా వేళా విశేషములనుబట్టి జరిగిన కొన్ని సంఘటనలు వ్యక్తుల యొక్క జీవితగమనమును మార్చుటతోబాటు దేశచరిత్ర నిర్మాణమునకు గూడ దారితీయు చుండును. నీకథ విన్నంతనే నాకు రత్నాకరుని వృత్తాంతము స్ఫురణకు వచ్చుచున్నది.

లక్ష్మణ:- (కుతూహలముగ) రత్నాకరుని వృత్తాంతమా!

జానకీదాసు:— ఔను, మొదటనతడొకబోయవాడు. దారిదోపిడి గజదొంగ, ఒకానొకవేళా విశేషమున సప్తర్షుల బోధచేత వాల్మీకి మహర్షి యైనాడు. ఆ తరువాత ఒక వేటగాడు క్రౌంచపక్షుల జంటను కొట్టిన దృశ్యమును జూచి ఉబికివచ్చిన శోకము శ్లోకముగ మాఱి మానవకోటి పశుత్వమును పరిమార్చుటకు రామకథను వెలయించి మహాకవియైనాడు.

లక్ష్మణ:—(విచికిత్సతో)కావచ్చును.....కాని....ఆతని వృత్తాంతము నాకెట్లు సమన్వయించునుగనుక ?

జానకీదాసు:— అదినూటికి నూరుపాళ్ళు సూటిగ సమన్వయింపకపోవచ్చు గాక. పోలికయన్నది అన్నియెడలను సార్వదేశవర్తిగ నుండ వలసిన పనిలేదు. ఏకదేశవర్తిగనున్నను చాలును. అందలి తత్వము ముఖ్యము. అదియుగాక నీజీవితమున ఇంకను జరుగ వలసిన కథ ముందున్నదిగదా.

లక్ష్మణ:—అట్లైన... ....

జానకీదాసు:—నిన్న మొన్నటిదాక నీలో కఠినకర్ముడగునొక వేటగాడు నివసించుచుండెను. గర్భిణీహరిణ హత్యానంతరము ఆతడంత రించి ఒక విరాగి ప్రవేశించినాడు. ఇకముందు ఏవేని మఱికొన్ని సంఘటనలు కారణముగ ఈ విరాగి ఒక గొప్ప వీరుడుగను, యోధుడుగను, దేశభక్తుడుగను మారి ధర్మరక్షణకు పూనుకొన గల సూచనలు కొన్ని స్ఫురించుచున్నవి. సర్వేశ్వరుని కృపవలన నాకు లభించిన యీకొద్దిపాటి పరిజ్ఞానముతో చెప్పుచున్నాను; నీవు ఈ దేశచరిత్రలో నొకక్రొత్తమలుపును తెచ్చుటకు ప్రయత్నింప గలవు సుమా!

లక్ష్మణః- స్వామీ, తమరు సెలవిచ్చుచున్నదేదియు ఇప్పుడు నామనసు కెక్కుటలేదు. భవిష్యమెట్లు జరుగవలసియున్నదో యట్లే జరుగగలదు. ముందు నాకేదైన తరణోపాయముపదేశింపుడు.

జానకీదాసు:—వత్సా! నేనూహించుచున్నదంతయు కాలక్రమమున తప్పక జరుగగలదని నా విశ్వాసము. రమ్ము, నాతో లాహోరు పట్టణమునకు రమ్ము, అచ్చటనాయుపదేశమును పొంది నూతన నామమును స్వీకరింపగలవు,

లక్ష్మణః- నూతననామమా?

జానకీ:—ఔను, కాషాయాంబరములను ధరించి బైరాగివై 'మాధవదాసు అను నూతననామమును స్వీకరింపగలవు.

లక్ష్మణః:- తమయాజ్ఞ.

(ఇరువురు నిష్క్రమింతురు)

## తృతీయ రంగము

కాలము—క్రీ.శ. 1708

సమయం—ఉదయం—తొమ్మిదిగంటలు

స్థానము

నాందేడునగరము- గోదావరీ తీరమున—మాధవదాసు ఆశ్రమము

(మాధవదాసు ఒకవైపునగల తన కుటీరమున తాంత్రికపూజలు సల్పుచున్నసవ్వడి వినిపించుచుండును. గురుగోవిందసింహుడు ప్రవేశించి

మరొకవైపునగల ఒకరాతిగుండుపై కూర్చుండి మాధవదాసు కొఱకు ప్రతీక్షించుచుండును. మాధవదాసుయొక్క శిష్యుడొకరు, ఎవరో ఆగంతుకుడు ఆశ్రమమున ప్రవేశించి రాతిగుండుపై కూర్చున్నట్లు మాధవదాసుకు తెలియజేయును. మాధవదాసు తన కుటీరము యొక్క కిటికీగుండ, ఆయాగంతుకుని చూసి, ఆతడెవ్వరో మహనీయుడు కావచ్చునని భావించియు, తనకుగల తాంత్రిక విద్యాప్రయోగ చాపల్యమునకులోనై ఒక్కుమ్మడి బిగ్గరగా మంత్రోచ్చారణ చేయుచు పెద్దగా నేవేవో ధ్వనులు చేయుచు గురుగోవిందునిపై తాంత్రిక విద్యను ప్రయోగించును. గురుగోవిందుడు దభీలుమని క్రిందబడి, తమాయించుకొని, విషయమును గ్రహించి తన ఆత్మశక్తిచేత, ఆతాంత్రిక ప్రయోగమును నిర్వీర్యమొనర్చి, నిబ్బరముగ మరల రాతిగుండుపై కూర్చుండి చిరునవ్వులు చిందించుచుండును. మాధవదాసు తన ప్రయోగము అట్లు నిర్వీర్యమగుటకు నివ్వెఱపడి, లజ్జితుడై తొట్రుపడుచు, తిన్నగనడుగులు వేయుచు గురుగోవిందుని సమీపించుచు, ఆతడు కురిపించు వాత్సల్య వృష్టిలో తడిసిపోవుచు అమాంతము ఆతని పాదములపై వ్రాలి... )

మాధవ ; అయ్యా, తమరెవరు?

గురు ; నేనెవరినో తెలియవా మాధవదాస్!

మాధవ ; తెలియజాలకున్నాను, చప్పున స్ఫురించుటలేదు; క్షమించగలరు.

గురు ; కొంచెము నిదానించి యాలోచించిన గ్రహింపగలవేమో ప్రయత్నింపుము.

మాధవ ; (ఒకనిముసమూలోచించి) బహుశా....తమరు....గురు...గోవింద సింహులు కావచ్చునని భావించుచున్నాను!

గురు ; (ఆనందచకితుడై)ఔను, మాధవదాస్! ఔను! సరిగానూహించితివి !

మాధవ ; తమరు నాయాశ్రమమున ప్రవేశించి దీనిని పావనమొనర్చుట మహద్భాగ్యముగ భావించుచున్నాను. దేశధర్మరక్షణకు సర్వస్వము ధారవోయుచున్న మీరు ఈ బడుగు బైరాగి వలననేమి యాశించి వచ్చితిరో సెలవిచ్చి నన్ను కృతార్థుని చేయగలరు.

గురు ; నిన్ను 'బందా'గా పరిగ్రహించుటకు వచ్చితిని!

మాధవ;- నన్ను 'బందాగా' పరిగ్రహించుటకు వచ్చితిరా! అట్లయిన! మహాత్మా! నేనే స్వయముగ మీకు సమర్పితమగు చున్నాను. ఇది మొదలు కొని నేను మీకు బందాను బందీని, శిష్యుడను.

గురు;—ఔను, ఇక నుంచి నీవు బందావే....కాని....నాకు కాదు మాధవ దాస్! భారత మాతృదేవికి....

మాధవ:-భారత మాతృదేవికా! ధన్యోస్మి, స్వామీ! ధన్యోస్మి. కాని మీకీయాలోచన....

గురు:-వినుము, వత్సా, వినుము : రాజస్థాన్‌కి చెందిన మహంతు జైత్ రామ్ ద్వారా నీ వృత్తాంతమును విన్నది మొదలుకొని నిన్ను యీ తాంత్రిక విద్యాలోలత్వమునుండి తప్పించి మాతృదేశ సేవకు మళ్ళింప వలయునన్న కుతూహల భరితమైన తపన రేకెత్తి నీ దగ్గఱకు వచ్చితిని.

మాధవ:- (క్రమ క్రమముగా జ్ఞాపకమునకు తెచ్చుకొనుచు) మహంతు.... జైత్‌రామ్ ద్వారా....నా వృత్తాంతమును విన్నది మొదలుకొని....

గురు:—నేను విన్నది యిది: నీవు లాహోరు పట్టణమున జానకీదాసు వలనఉపదేశమును పొంది మాధవదాసను నూతననామధేయమును

స్వీకరించి దేశాటనము చేయుచు నాసిక్ పుణ్యక్షేత్రమునకు చేరు కొంటివి. అక్కడ అఘోర నాధుడను పేరుగల తాంత్రికునికి శిష్యుడవై తాంత్రిక విద్యల నభ్యసించితివి. అఘోర నాధుడు మరణించిన పిమ్మట ఇక్కడికి వచ్చి మంత్రతంత్రములను ప్రయోగించుచు తొలుత కొందఱకు ఉపకార మొనర్చితివి. కాని పోను పోను కొందఱకు హాని కలిగించుచూ....

మాధవ;-(తత్తఱపాటుతో) అయ్యా;

గురు;-(నవ్వి) తత్తఱ పడకుము, మొదట మొదట నీవు సద్బుద్ధితో సాత్విక బుద్ధితో కొందఱికి మేలు చేసితివి! అనావృష్టి వలన కఱువు కాటకము లేర్పడినప్పుడు నీతాంత్రిక విద్యా ప్రభావముతో వర్షములు కురిపించి అపర ఋష్యశృంగుడ వనిపించుకొంటివి.

మాధవ:- (సంభ్రమానందములతో) అయ్యా!....

గురు;-సంతాన హీనులకు సంతానమునను గ్రహించి పుత్రకామేష్టియందు పాయసాన్నము గ్రహించి వచ్చిన యజ్ఞపురుషుడవనిపించుకొంటివి!

మాధవ;—(సంభ్రమాశ్చర్యములతో) స్వామీ తమరు....

గురు;—మరణావస్థలో నున్న వారిని బ్రతికించి సంజీవకరణి తెచ్చిన హనుమంతుడ వనిపించుకొంటివి!...

మాధవ:—(సంభ్రమాశ్చర్యానందములతో) మహాత్మా! ఇవన్నియు....

గురు:-గొప్ప పేరు ప్రతిష్ఠలు గడించి ప్రజలకారాధ్య దైవమైతివి....కాని.. అంతటితో అహంకార కిరీటమును నెత్తికెక్కించు కొంటివి...

మాధవ : (ఒక్కసారి ఉలిక్కిపడి) అహంకార కిరీటమా!

గురు : తమాయించుకొనుము. తొలిదశలో సాత్త్వికముగసాగివచ్చిన నీతాంత్రిక విద్యా ప్రయోగము మలిదశలో తామసికమై క్షుద్ర విద్యగా మారిపోయినది. నీ దగ్గఱకు వచ్చిన మహనీయుల మీదను అతిథుల మీదను దానిని ప్రయోగించి వారు తిరుగుడు పడుచుండ, హఠాత్తుగ సంభవించిన శరీర యాతనలకు గగ్గోలు పడుచుండ చూచి నవ్వుచూ ఆనందించు క్రూరత్వమునకు దిగ జారిపోయితివి.

మాధవ : (తట్టుకొనలేని పశ్చాత్తాపముతో) స్వామీ....

గురు ; అట్లు అవమానింపబడిన వారిలో ఆ మహంతు జైత్‌రామ్ ఒకడు. జ్ఞప్తికి వచ్చినదా?

మాధవ : (అదే స్థితిలో) ప్రభూ!....

గురు : ఆతడు చెప్పగా విని నీ ఉద్దండలీలకు ఆశ్చర్యానందచకితుడనై నిన్ను యీ తమస్సు నుండి తప్పించి నీ శక్తి సామర్థ్యములను సరియైన మార్గమునకు మళ్ళింపవలయునను అభిలాషతో నిటకు వచ్చితిని, కాని....కాని....

మాధవ : (ఆవేదనతో) మహాత్మా!....

గురు ; నీ ప్రతాపమును చివరికి ఈమాతృధరిత్రికి సేవకుడనగు నాపై గూడ ప్రయోగించితివే!

మాధవ : (ఆవేదనతో నాక్రోశించుచు పాదములపై ప్రాలి) గురుజీ! నేను బందాను. మీ బందాను....భరత భూమిబందాను....

గురు ; (అతనిని లేవనెత్తి హఠాత్తుగ, ఆప్యాయముగ గుండెలకు హత్తుకొని) ఔను వత్సా, ఔను, నీవు బందావు! మాతృభూమి పూజకొఱకు పుష్పముగాపూచిన పుత్ర పుంగవుడవు!

మాధవ ; (రెప్పలను తాటించి కన్నీళ్ళను రాల్చి నిబ్బరముగ) మహాత్మా కర్తవ్యము నాజ్ఞాపింపుడు.

గురు ; వత్సా! నా బదులుగ పంజాబునకు వెళ్ళి అక్కడి నా శిష్యులకు నాయకత్వము వహించి సంఘటిత-హిందూశక్తితో ధర్మరక్షణకు కృషిచేయుము. అక్కడి హిందువులపై మొగలాయీలు సాగించుచున్న దారుణదమన కాండను అరికట్టుటకు కటిబద్ధుడవుకమ్ము. వారి క్రౌర్యమునకు బలియైపోయిన నా తండ్రియొక్కయు, తనయుల యొక్కయు ఆత్మశాంతికి ప్రతీకారమొనర్చి నా కూరట కల్గింపుము!

మాధవ : ప్రభూ! మీ తండ్రి యొక్కయు,తనయుల యొక్కయు బలిదాన కథానకమును గూర్చి స్వయముగ మీముఖతః వినిపించి నాకు స్ఫూర్తిని భావోద్రేకమును కలిగింపవలసినదిగా వేడుకొనుచున్నాను.

గురు ; నా తండ్రి గురుతేజ బహదూరు, శిక్కులకు తొమ్మిదవ గురువు. ఇస్లామును స్వీకరించుటకు నిరాకరించినందువలన ఔరంగజేబు శిరచ్ఛేదము చేయించినాడు!

మాధవ ; ఎంతదారుణము!

గురు:_నా పుత్రులు నల్వురు. మూడవవాడగు జొరావరుసింగు తొమ్మిదేండ్లవాడు.నాల్గవవాడగు ఫతేసింగు యేడేండ్లవాడు. వీరిద్దరు బహా

తాత్కారముగ ఇస్లామును స్వీకరించుటకు తిరస్కరించినందు వలన సర్‌హిందు నవాబు గోడలలో కట్టించి సజీవసమాధి చేయించినాడు,

మాధవ:- ఎంత పైశాచిక క్రూరకృత్యము!

గురు:- పెద్దకొడుకులిర్వురు- అజిత్‌సింగు జొరుఝూవరుసింగులు మొగలులు చమ్‌కౌరును ముట్టడించినప్పుడు జరిగిన యుద్ధములో వీరస్వర్గ మలంకరించిరి,

మాధవ ; సెభాష్: వీరసింహకిశోరములారా! సెభాష్!

గురు ; నా కుటుంబమంతయు దేశధర్మరక్షణ కొఱకు మరణించుట నా కెంతటి గర్వకారణమో వర్ణింపజాలను. కాని....కాని... గోడలందు క్రుంగిపోయిన ఆ చిఱుత కూనల చిఱునవ్వులు నా కన్నులకు వెల్గుదొంతరలై, అశ్రుపూరములై, ఆణిముత్యములై మెత్తగజారిపడినప్పుడు కలుగు అనుభూతి తలపునకు వచ్చినప్పుడు ఉబికివచ్చు నానందము బ్రహ్మానంద సహోదరమగుచుండును!

మాధవ : (ఒకక్షణము చలించి కన్నీరుతుడుచుకొని) మహాత్మా? ఆ మహనీయుల బలిదాన కథానకముతోబాటు యిన్ని కష్టములకు క్రాగి జీవలవమునమూగు లాడుచున్నను శలాకవలెనందముగనున్న మీ దేహయష్టియు నాకొక భవ్యమైన యావేశమును కలిగించుచున్నది. ఇప్పటి వఱకు తామసిక తాంత్రిక విద్యాప్రయోగ వ్యామోహమున దిగబడి, అందువలన లభించిన కుహనాకీర్తి ప్రతిష్ఠల మోజులో కూరుకొనిపోయి, పేరుకొనిపోయిన యహంకారము యొక్క ఒక్కొక్క మెట్టును పైపైకెక్కుచు కళంకితమై

పోయిన యీజీవితము ఇప్పుడు ఖాల్సాగంగలో తానమాడి పావన మగుచున్నదని తలచినంతనే ఒడలుపులకలు వొడముచున్నది. ఇదిగో, గురుపుత్రులవధకు బదులు తీర్చుకొనుటకు ఈ బందా పయనమై పోవుచున్నాడు, ఆశీర్వదింపుడు?

గురు ; వత్సా? నా కుటుంబసభ్యుల వధకు ప్రతీకారమొనర్చుటే మన ప్రధాన ప్రయోజనముకారాదు. అట్లయినచో నంతటితో మన ఉద్యమము ఆగిపోవలసివచ్చును. అదొక తాత్కాలికమైన గౌణప్రయోజనము మాత్రమే. విదేశీయుల పాలనమునుండి మన దేశమును విముక్త మొనర్చుకొని మనధర్మ సంస్కృతులను కాపాడు కొనుట యన్నది మనకు శాశ్వతమైన, ప్రధానమైన అంతిమలక్ష్యము కావలయును. ఇదిగో, శిక్కులపై నీయాధిపత్యమునకు సంకేత ముగ నాతూణీరమునందలి పంచబాణములను, ఖడ్గమును, ఢంకాను, ధ్వజమును, నీకు దత్తము చేయుచున్నాను.

మాధవ ; మహాప్రసాదము!....నేను వేటాడిన లేడి గర్భము నుండి వెలు వడిన రెండు పిల్లలు మరణించిన దృశ్యమొకటి, జానకీ దాసు చెప్పిన-నిషాదుడు కొట్టిన క్రౌంచపక్షుల జంటను చూచి వాల్మీకి ముని పుంగవునియెదకరిగి శ్లోకమావిర్భవించిన కథ కర్ణనము మఱియొకటి, ఇప్పుడుమీ ముఖతః విన్న–గోడలందు క్రమ్మగిపోయిన మీ యిద్దరు చిఱుబాలురకథా శ్రవణము ఇంకొకటి-ఇట్లు రెండు.... రెండు....రెండు, ఒకటి వెంటనొకటి తఱుముకొని వచ్చినట్లు ఉక్కిరిబిక్కిరి చేయుచు నన్నుముందుకు త్రోయుచున్నవి! ఆనాడు జానకీదాసు సెలవిచ్చిన భవిష్యము—ఇప్పుడు విరాగివైన నీవు ముమ్ముందు ఏవేని యొకటి రెండు సంఘటనలు కారణముగ వీరుడవై, యోధుడవై, దేశభక్తుడవై ఒకచోట దేశచరిత్రను

కొంత మఱపు తీవ్వగలవు—అన్నమాట మీరు నిమిత్తముగ, మీ యాశీస్సులతో సార్థకమగుచున్నట్లు తోచుచున్నది; యాశ్చర్యము!

గురు ; వత్సా ! యిప్పటి నుండి నీవు ఈ విరాగి దుస్తులను పరిత్యజించి వీరుని దుస్తులు ధరింప వలయును. ఇక నీవు బందా బహాదురు వనియు, బందాసింహుడవనియు, వీరబైరాగివనియు, బందా బైరాగివనియు ప్రసిద్ధి వహించెదవు గాక!

మాధవ ; తమ యాజ్ఞ.

గురు : నీకు సహాయముగ పంచప్యారా పరిషత్తులో సభ్యులైన నా ఐదు గురు అనుంగు శిష్యులు నీ వెంటవత్తురు. పౌమ్ము, ఖాల్సా సైన్య మునకు నాయకత్వము వహించి పంజాబును రక్షించి దేశమంత టికీ ఒక స్ఫూర్తిని ప్రసాదింపుము.

మాధవ ; కృతార్థుడనౌదునుగాక !

గురు : వత్సా ! నేను పంజాబు నుండి యీ నాందేడు ప్రాంతమునకు వచ్చుటలో గల రెండు మూడు ఆంతర్యములను విడమర్తును వినుము :— ఒకటి వెంటనొకటిగ నన్ను వెంబడించిన కష్టముల వలన జర్జరితుడనైన నేను మఱలపుంజుకొనవలయునన్న కొంత విశ్రాంతి యవసరమని భావించితిని. నా తదనంతరము పంజాబు ప్రజలకు నాయకత్వము వహింపగల దిట్ట అక్కడ నాకు తారసపడకపోవుటవలన అట్టి వానిని యన్వేషించుటకై వచ్చితిని. ఈ రెండిటి కంటె ముఖ్యమైనదేమన నా బాల్యమున ఛత్రపతి శివాజీ మహరాజు సాధించిన విజయపరంపరను గూర్చి విన్నప్పుడు ఆ రహస్యమును గూర్చి తెలిసికొనవలయున

మిక్కిలి కుతూహల పడుచుండెడివాడను. నా తండ్రి గురుతేజ బహదూరు బలిదానమునకు పిమ్మట నేనే స్వయముగ మహారాష్ట్రమునకు వచ్చి ఛత్రపతిని దర్శింపవలయుననియు నువ్విళ్ళూరుచుండెడివాడను. కాని యప్పటి నా వయస్సుగాని, యచ్చటి పరిస్థితులుగాని యనుమతింపలేదు. శివాజీకి పిమ్మట నాతని వారసులు శంభాజీ, రాజారామ్, శహాజీ ప్రభృతులు క్రమముగా మొగలులతో పోరాటములు సల్పుట తెలిసిన విషయమే. దేశమునందలి ఆయా ప్రాంతములలో నీయుద్యమములన్నియు విడివిడిగా జరుగుటకంటె, వీటినన్నింటిని ఒకత్రాటిపైకి తీసికొనివచ్చి, ఏకసూత్రబద్ధముచేసి దేశవ్యాప్తమహోద్యమముగ నిర్వహించుటమే ఉత్తమము. కావున నిప్పటి హిందూపదపాదుషాహీ నాయకులతో సంప్రదించి అట్టి వ్యూహరచనమునకు అవకాశమున్నదేమో పరిశీలించుటయు నా ముఖ్యమైన యాంతర్యము. నా యీ ప్రయత్నములను గూర్చి క్రమముగా నెప్పటికప్పుడు నీకు వర్తమానములు పంపుచుందును. పొమ్ము. విజయీభవ, దిగ్విజయీభవ:

మాధవ : ధన్యోఽస్మి మహాత్మా! ధన్యోఽస్మి. (పాదములకు ప్రణమిల్లును)

(ఇరువురు నిష్క్రమింతురు)

# చతుర్థ రంగము

కాలము: క్రీ.శ. 1708

సమయం—సాయంత్రం ఏడుగంటలు

స్థానము

ఢిల్లీకి కొంతదూరమున పంజాబు పొలిమేరలలోగల నొక గ్రామము. (అందలి పాతభవంతి. సమాలోచనా మందిరములో నాసీనులైన బందాబైరాగి, పంచప్యారా పరిషత్తులో సభ్యులైన రామసింహుడు—కహాన్‌సింహుడు — బాజ్‌సింహుడు-వినోద్‌సింహుడు - దయాసింహుడు- మఱికొందరు అంతరంగికులున్న.)

బందా ; వీరవరేణ్యులారా! నాందేడునుండి యిక్కడిదాక, ఇతరులెవ్వరు గాని యనుమానించకుండ, ఎంతో మెలకువతో ప్రయాణము సాగించి సురక్షితముగ నిచ్చటకు చేరుకొనగల్గితిమి. శ్రీ గురు గోవింద సింహు లనుగ్రహించిన ఆజ్ఞాపత్రములను యిచ్చటి శిక్కు ప్రముఖుల సమక్షమున సమర్పించిన మీదట వీరందరు నూతనోత్సాహముతో మన యుద్యమములో చేరి సహకరించుట మహదానందకరముగ నున్నది. మనము చేయుచున్న ప్రయత్నములను గూర్చిన వార్తలు గ్రామగ్రామమునకు ప్రాకి యెందరెందరో జానపదులు సైతము మనవైపుచేరి మాతృదేశ సేవలో తమవంతు బాధ్యతలను చెల్లించుటకు సిద్ధముగనున్నా రన్న వార్తలు గూడ మీరు వినియేయుంటిరి. ఏ ఉద్యమమునకు గాని సామాన్య ప్రజల అండదండలే మిక్కిలి ముఖ్యము. ఇప్పుడు

మన మొక చక్రనివ్యూహమును రచించుకొని శత్రువులపై దాడివెడలుటయే తరువాయి. ఆ మేఱకు మీమీ యభిప్రాయములను వెల్లడింపవలసినదిగా మనవి చేయుచున్నాను.

నేపథ్యములో : ప్రభూ? నాందేడు నుండి వచ్చిన వార్తాహరుడొకరు తమ దర్శనమునకై వేచియున్నాడు.

బందా : (సోత్సాహముగ) వెంటనే ప్రవేశపెట్టుము.

వార్తాహరుడు : (ప్రవేశించి, ప్రణామములాచరించి, గద్గదస్వరముతో) ప్రభూ? తమకొక ఘోరవిషాద వార్తను వినిపింపవలసి వచ్చినందులకు దుఃఖము పెల్లుబుకుచున్నది.

అందరు : (ఆదుర్దాగా) ఏమిటది?

వార్తాహరుడు : శ్రీ....గురు....గోవింద....సింహులు....మరణించిరి.... కాదు....హత్య....హత్యగావింపబడిరి?

అందరు : (ఒక్కుమ్మడి) హత్యయా?

వార్తాహరుడు ; చిత్తము. ప్రభూ?

అందరు : అదెట్లు సంభవించినది?

వార్తాహరుడు ; చిత్తగింపుడు. శ్రీ గురు గోవింద సింహులు తమ చావడిలో నిద్రపోవుటకు ప్రారంభించుచుండిరి. ఇంతలో నొకపఠాను—గుల్‌ఖాన్ అనుపేరుగల వాడు ఆత్మీయునివలె లోపలికి వచ్చి హఠాత్తుగా వారి దేహమును బాకుతో మూడు నాల్గుసారులు పొడిచి పొడిచి పారిపోయినాడు !

అందరు : (ఆక్రోశముతో) ఎంతదురంతము? ఎంత దురదృష్టము?

వార్తాహరుడు : కాని, ఆశ్చర్యమేమన శ్రీ గురుసింహులు అతనిపై మెఱుపుదాడి జరిపి శిరచ్ఛేదము గావించినారు!

అందరు : శహభాష్, శహభాష్, సింహము సింహమేమరి! తరువాత.

వార్తాహరుడు : తరువాత తీసిన ఆచూకీనిబట్టి యాహంతకుడు నర్‌హింద్ సుబేదారైన వజీర్‌ఖాన్ నియమించిన కిరాయి కిరాతకుడని తేలినది!

బాజ్‌సింహుడు ; ఓరీ, కిరాతకుడా! వజీర్!

బందా ; బాజీ! ఆవేశపడకుము, శాంతింపుము (వార్తాహరునితో)ఆపిమ్మట.

వార్తాహరుడు : ఆ పిమ్మట నెంతటి గట్టి చికిత్స జరిగినను గాయములు మాని నట్లే మాని, మఱల సెలవేసి పగిలి జరిగిన పూర్ణిమ నాటి అర్ధరాత్రి ఆ వీరవిక్రమ కళాప్రపూర్ణుని ప్రాణబింబము చంద్ర బింబముతో లీనమై అమృతత్వ మందినది! సెలవు. (నిష్క్ర- మించును)

అందరు ; (ఒక్కుమ్మడి) గురుజీ! (అనియాక్రందించి విలపించు చుందురు. కొంత సేపు విషాదవాతావరణము ఆవరించియుండును. ఆ నిశ్శబ్ద వాతావరణమును చీల్చుచూ)

బందా ; మిత్రులారా! ఈ వార్తాహరుడు శ్రీ గురుదేవులు పంపిన సందేశ మును వినిపించునని భావించితినిగాని వారిహత్యోదంతమును వినిపించునని కలలో గూడనూహింపలేదు. ఎంత ఘోరవిపత్తు సంభవించినది. (దుఃఖమును నిగ్రహించుకొని) వారి మరణము ....కాదు....హత్య మనకు తీరని దుఃఖమును కలిగించినది. వారు

లేనిలోటు ఈ జన్మకు తీరునది కాదు. అయితే యెట్లయినను ఆ దుఃఖము దిగమ్రింగుకొని అందువలన గ్రహించిన స్ఫూర్తితో కార్యశూరులమై విజృంభింపవలయునేగాని నిరుత్సాహముతో నీరు కారి పోరాదు. అది మరణ మనియో, హత్యయనియో భావించుటకంటె అదొక అవతార పరిసమాప్తియని తలచుట లెస్స. అసలు ఆ కుటుంబమే అంతః తండ్రి శిరచ్ఛేదమునకు గురియయ్యెను. కొడుకులు సజీవ సమాధికి సమర్పితమయిరి. తానుకూడనట్టి దారుణ దురంతమునకే బలియయ్యెను. ఆటవికుని శరాఘాతమువలననే గదా శ్రీ కృష్ణ నిర్యాణము సంభవించి నది. ఆ మహితాత్ముల త్యాగాగ్నులూదిన విస్ఫులింగములు మనకు దారి దీపములై వెలుగొందు గాక? ఇప్పుడిక ఇనుమడించిన యుత్సాహముతో మనము విజృంభింపవలసి యున్నది. అందుకు తగిన వ్యూహరచనకు పూనిక వహించెదరుగాకయని మనవి చేయుచున్నాను.

బాజ్‌సింహుడు : ప్రభూ! మనకు వచ్చిపడిన యీ కష్టములన్నింటికి సర్‌హింద్ ప్రాంతమే మూలస్థానము. దానిసుబేదారైన వజీరుఖానే మూలకారకుడు. అతడు నియోగించిన కిరాతకులే యిన్ని దారుణ కృత్యములకు పాల్పడినారు. కావున మన దండయాత్ర సరాసరి సర్‌హింద్ మీదకే నడిపింపవలయును.

రామసింహుడు ; మనప్రస్థానభేరి మ్రోగిన వెంటనే మొట్టమొదట తటస్థ పడు శత్రుస్థావరము 'సామానా' అనునది. దాని సామంతుడు జలాలుద్దీన్ అనువాడు. అతడే వజీర్‌ఖాన్ చేత నియమింప బడి గురు తేజబహదూరును శిరచ్ఛేదము గావించిన క్రూరుడు. కావున

నాతనితో సహా ఆతని 'సామానా' పట్టణము మనకు ప్రథమ కబళము కావలయును సుమా?

కహాన్‌సింహుడు ; ఆ పిమ్మట ముట్టడింపవలసిన మరొక ప్రధాన శత్రు స్థావరము కాపురి పట్టణము. దాని పాలకుడు కాదముద్దీన్ అను వాడు. హిందూ కుటుంబములపై దాడిచేసి ఆస్తిపాస్తులను దోచుకొని తన విలాసములకు వెచ్చించుచు పశుప్రవృత్తిలో జీవించుచున్న యాతనిని హతాహతమొనర్పవలయును.

బినోద్‌సింహుడు ; అదేవరుసలో నున్న 'సాఢౌరా' పట్టణమును విడిచి పెట్టరాదు. ముస్లిములు సాగించు దారుణ హింసాకాండకు అది మఱొక గొప్ప కేంద్రము. గోహత్యకు పెద్ద కబేళావంటిది! అక్కడ మరణించిన హిందువుల దహన క్రియలు గూడ జరుప నివ్వరాదని దాని సర్దారు ఉస్మాన్‌ఖాను యొక్క క్రూరమైన యాదేశము. ఆతని యొక్క హేయమైన క్రూరకర్మములను అసహ్యించుకొని శ్రీ గురుగోవింద సింహులకు సహాయ మొనర్చిన నేఱమునకు బుధుషావంటి సాధు ముస్లింసోదరులను సైతము చిత్రహింసలకు గురిచేసి చంపిన దుర్మార్గుడాతడు. ఆతనితో సహా సాఢౌరా పట్టణమును భస్మీపటలముచేసి తీరవలెను ప్రభూ!

దయాసింహుడు:—ఆపైన సరాసరి సర్ హింద్ నవాబు వజీర్ ఖాన్ మీదకే మనదాడి. ఈ మధ్యలోగల ముఖలిస్‌గఢ్, కిరాటపూర్, రూపార్ మొదలగు ప్రదేశము లన్నియు ఒక్క తృటిలో పిప్పి పిప్పి కాగలవు. మన శక్తినంతయు కుమ్మరించి ఆక్రమించు కొనవలసినది ఆ సర్‌హింద్ రాజ్యమే. ఆ వజీర్ ఖానుడెంతటి కిరాత

కుడు! ముక్కుపచ్చలారని గురుసింహుని పుత్రులను అతడు జీవ సమాధి చేయించిన ప్రదేశము అదే ప్రభూ! వానిపేరు విన్నంతనే మన శిక్కు సోదరుల గుండెలు భగ్గుమని మండుచున్నవి. ఆ మంటలనుండి రాలుచున్న రవ్వలు వజీర్‌ఖాన్‌తో సహా ఆసర్‌హింద్ రాజ్యమును భస్మీపటలము గావింపగలవు. అప్పుడు గాని మనకు శాంతి లభింపదు ప్రభూ, శాంతి లభింపదు.

బాజ్‌సింహుడు:-వజీర్‌ఖాన్‌తో పాటు ఉప్పుపాతర వేయవలసినయసలు ద్రోహి సుచానందు అనువాడు. వాడు హిందువై యుండియు వజీర్‌ఖాను కడ బానిస మంత్రియై అపసిభాలురను జీవసమాధి చేయింప వలసినదిగా మఱింత పురికొల్పి తొందరపెట్టిన దుష్టాత్ముడు. ఒకొక్కప్పుడు విదేశీ ద్రోహులను విడిచిపెట్టవచ్చునేమో గాని యెట్టి పరిస్థితులలో సైతము మాతృదేశ ద్రోహులను విడిచి పెట్టరాదు ప్రభూ, విడిచి పెట్టరాదు.

బందా:-ఆత్మీయులారా! మీరుచేసిన వ్యూహరచన చాల చక్కగనున్నది. కాని మన పవిత్ర ఖాల్సా సైన్యము చాలా చిన్నది. రెండువేలకు మించిన సైన్యము మనకు లేదు. ఫిరంగులుగాని, శతఘ్నులుగాని, అశ్వగజసైన్యములుగాని మనకులేవు. సర్‌హింద్ నవాబునకు వీటన్నిటితోబాటు ఇరువదియైదు వేల కాల్బలమున్నది. ఈ తారతమ్యమును తైపారువేసికొనుచు చాల జాగ్రత్తగా మనము రణరంగమున దూకవలసియున్నది.

బాజ్‌సింహుడు:-ప్రభూ! ఆవిషయమున మనము ఏమాత్రము జంకవలసిన పనిలేదు. మన రెండువేల సైన్యము వారి యిరువదియైదువేల సైన్యమునకు బరాబరి కాగలదు. మనవారికి గల చక్కని క్రమ

శిక్షణ, మంచిపట్టుదల, గొప్ప ఆత్మవిశ్వాసము వీటికితోడు వారి మనస్సులలో నుజ్జ్వలమగుచున్న ప్రతీకారవాంఛ - ఇవియే మనకు గల గొప్ప ఆయుధములు. ఇక ప్రజల అండదండలను గూర్చి చెప్పవలసిన పనిలేదు. శ్రీగురుసింహుల యాశీర్బలముతో మనము శత్రుసముద్రమును అవలీలగా నీదగలము.

అందరు:- ఔను ప్రభూ! బాజ్‌సింహుడు చెప్పినది మిక్కిలి యధార్థము.

బందా : శ్రీగురు గోవిందసింహులు పంచప్యారా పరిషత్సభ్యులైన మీ అయిదుగురను నాకు ప్రసాదించి మీ సహాయ సహకారములతో ఈ ఉద్యమమును నిర్వహింపవలసినదని యాదేశించినారు. కావున మీకు నేను అంతగా చెప్పవలసినదేమియులేదు. అట్లయ్యును ఒకటి రెండు మాటలు మనవిచేయుచున్నాను. మనము శత్రువులను హతమార్చవలయునేగాని సామాన్య ప్రజలకు హానికలిగింపరాదు. ముఖ్యముగ స్త్రీబాల వృద్ధుల జోలికి అసలేపోరాదు. వైరుల పట్టణములను, ఆస్తిపాస్తులను స్వాధీనము చేసికొనవలయునేగాని నాశనముచేయకూడదు. ఆక్రమించుకొన్న భూభాగములను ఎక్కడికక్కడ ఎప్పటికప్పుడు మన యేలుబడికితెచ్చుకొని మన దగు రాజ్యనిర్మాణమునకు పునాదులు వేసికొనవలయును. మధ్య మధ్య సంభవించు జయాపజయముల కతీతముగ అంతిమలక్ష్యమును సాధించువరకు విశ్రమింపరాదు. లెండు, కట్టాయితము కండు, శ్రీగురు గోవింద సింహుల యాశీస్సులే మనకు శ్రీరామరక్ష!

అందరు:-జై శ్రీగురు గోవిందసింహమహారాజుకీ జై! శిక్కుధర్మకీ జై! హిందూధర్మకీ జై! భారతమాతాకీ జై!

(అందరూ నిష్క్రమింతురు)

## పంచమ రంగము

కాలము-క్రీ.శ-1618

సమయం-సాయంత్రం ఏడు గంటలు

స్థానము

మొగలాయీల ఢిల్లీ దర్బారు

(పాదుషా ఫరూక్షియరు, సైన్యాధిపతి మహమ్మద్ హామీద్‌ఖాన్, లాహోరు నవాబు అబ్దుల్ సమద్‌ఖాన్, జమ్మూ ఫౌజుదారు జకరయాఖాన్ మొదలగు ముస్లిం సర్దారులు, కాంగ్రా సంరక్షకుడు కటోచ్ రాజా, జస్రోతా రాజు హరదేవుడు మొదలగు హిందూబానిస కొలువుగాండ్రు కొలువు తీరి యుందురు.

సూచన: ముస్లింపాత్రధారులు హుక్కా పీల్చుట వంటి వ్యసనములనుగాని, తురక తెలుగునుపయోగించు విధానమునుగాని ప్రయోక్తలు, నటులు తమకుతోచిన రీతిలో ప్రవేశపెట్టుకొనగలరు. లేదా ఈ సంభాషణలను యథ తథముగ పలికింప వచ్చును.)

ఫరూక్షియరు: సుబేదారులారా! ఆబైరాగియొక్క ఆగడములు రోజురోజుకు పెచ్చుపెరిగి మనకొక పెద్ద బెడదగా పరిణమించినవి. ఆస లాతడు, సర్ హింద్‌రాజ్యమును, అపరిసర ప్రాంతములను ఆక్ర మించుకొని ముఖలిస్ పర్వత సానువులలో దుర్భేద్యమగు లోహ గఢను నిర్మించుకొని శివాజీ వలె హిందూరాజ్య నిర్మాణమునకు గట్టి పునాదులు వేసినాడన్న విషయము తలచుకొన్నంతనే గుండెలు గుభేలుమనుచున్నవి. ఔరంగజేబు తరువాత వరుసగా వారసులైన బహదుర్షాగాని, జహందర్‌షా గాని యీ హిందువుల దాడిని సామర్ధ్యముతో నెదుర్కొనక పోవుటవల్లనే యిప్పుడు మనకు ఇంతటి దుస్థితి దాపురించినది. మనకు ప్రక్కలోబల్లెమై పోయిన ఆ కాఫిర్ బైరాగిని యెట్లయినను బంధించి తెచ్చి హతమార్చుట తప్ప గత్యంతరము కాన్పింపదు. అందుకు తగిన, దమ్ములు, చాకచక్యముగల ధీరులెవ్వరో ముందుకు రావలసి నదిగా ఆజ్ఞాపించుచున్నాను.

మహమ్మద్: ప్రభూ! అతనిని బంధించు ప్రయత్నము గడచిన కొన్ని నెలలుగా ఎప్పటికప్పుడు తీవ్రముగ జరుగుచునే యున్నవి. కాని యాతడు చిక్కుట లేదు. మన సైన్యాధిపతి రుస్తుందిల్‌ఖాన్ ఈసారి యెట్లయినను సజీవముగగాని నిర్జీవముగగాని బంధించి తెచ్చెద నని ప్రతిన బూని విశ్వప్రయత్నము చేయుచున్నాడు. ఆ శుభ వార్తను మీకెఱిగించు సమయ మాసన్నమైనదని భావించు చున్నాను.

ఫరూక్షియరు:— ఇంతటి దిట్టలైన మీ వంటి సర్దారులుండి కూడ ఇంత వరకు ఆ మిడతంబొట్లును చిక్కించుకొనలేకపోవుట నాకాశ్చ ర్యముగనున్నది. అందుకు కారణమేమో చెప్పగలరా!

అబ్దుల్ ; ఆతడు గడచిన కొంత కాలముగ మైదానములకు వచ్చి యుద్ధములు చేయుట మాని ఆక్రమించుకొన్న భూభాగములను కట్టుదిట్టము చేసికొనుటలో నిమగ్నమై యున్నాడు. లోహగఢకు చుట్టూ కానున్న సర్‌హింద్ మొదలైన పట్టములకు పంచప్యారా పరిషత్తులో సభ్యులైన బాజ్‌సింహ మొదలైన వారిని పాలకులుగ నియమించి రాజ్యమును చక్కని చక్రవ్యూహముగ రూపొందించినాడు. వంకర టింకరగనున్న ఆ కొండ గుట్టలను దాటుకొని పోయి దుర్భేద్యమైన ఆలోహగఢను ముట్టడించి యాతనిని బంధించుట చేతగానిపని,

జకరయాఖాన్: కొండగుట్టలమాట నటుండనిచ్చి అసలు మనము మైదానములందు గల గ్రామములలో సైతము ప్రవేశింపజాలము. ఆతడు గ్రామీణులను ఆకట్టుకొనుటకు ఎన్నియో పన్నుగడలు పన్నినాడు,ఆయాచోట్ల గల జమీందారులకడ,జాగర్దారులకడ వెట్టిచాకిరీ చేయుచు బానిసత్వములో క్రుమ్గుచున్న రైతులను, ఇతర జానపదులను ప్రోత్సహించి, తిరుగుబాటు చేయించి జమీందారీ పద్ధతిని రద్దుచేసినాడు. సామాన్యప్రజలను తనవైపునకు త్రిప్పుకొనిసంఘటిత పఱచి ప్రజాసైన్యమును ఏర్పాటుచేసి కొనినాడు, మనము ఆగ్రామములలో కాలుపెట్టినదే తడవు వారు మనలను కాటువేయగలరు.

కటౌచ్‌రాజా ; ప్రభూ! పురుషులేగాదు: స్త్రీలు సైతము రంగములో దిగుటకు సిద్ధముగా నున్నారు. బీబీ అనూప్‌కౌర్ అను శిక్కుయువతి శ్రీ గురుగోవింద సింహుల యింటిలో పనిచేయుచుండెడిది.ఆమెనుమాలేరుకోట సర్దార్ షేక్‌మహమ్మద్ ఖాన్ బంధించెను.

ఆమె తన మానసంరక్షణ కొరకు ఆత్మహత్య గావించుకొనెను. శిక్కు సంప్రదాయము ననుసరించి ఆమెను దహనము చేయుటకు బదులు మనవారు పూడ్చిపెట్టిరి. పిమ్మట నాబైరాగి ఆమెయొక్క అవశేషములను వెలికితీయించి దహనసంస్కారములు చేయించి నాడు. ఇది హిందూస్త్రీలను సంఘటితము చేసినది. ఆ బైరాగి యన్న వారికి ప్రత్యక్షదైవమే!

హరదేవు : ఆతనికి ఇద్దరు భార్యలు, పెద్దభార్య ఛంబారాజు ఉదయ సింహుని కుమార్తె. ఆమె యందు వానికి ఇద్దరు కొమరులు కలిగిరి. వారు కవల పిల్లలు. అజయసింహ, అమరసింహ అను వారు. ఆమధ్య వారి జన్మదినోత్సవ వేడుకలు మహావైభవముగ జరిగినవి. అందులో హిందూకుటుంబముల వారందరు ఎంతో ఉత్సాహముతో పాల్గొనిరి. స్త్రీల ఆనందమునకు మేరలేదు. ఈ విధముగ నాతడు చిక్కిన ప్రతిచిన్న యవకాశమును జారవిడువ కుండ నలుగురుని ఆకట్టుకొని సంఘటిత పరచి తనశక్తిని పెంచుకొను చున్నాడు.

మహమ్మద్:- మంత్ర తంత్ర విద్యలను ప్రయోగించుటలో నారితేరినవాడు!

అబ్దుల్:- అందువలనమన ఆయుధములు ఆతనిని చెనకలేక పోవుచున్నవి.

జకరయా:-చిక్కినట్లే చిక్కి చటుక్కున మాయమై పోవుచుండును!

కటౌచ్‌రాజా:ఒకవేళ పట్టుకొని కట్టివేసినను ఆ త్రాళ్ళు, గొలుసులు వాటం తట యవే పుటుక్కున తెగిపోవును ;

హరదేవు:ఆతడు ఉప్పున నూదినంతనే నోటినుండి పొగలు సెగలు చిమ్మి రవ్వలు లేచి నిప్పులు గ్రక్కుచుండును!

కటౌచ్‌రాజా. అందులో మన వారు మలమలమాడిపోవుచున్నారు.

ఫరూక్షియరు: (బిగ్గఱగ గర్జించి కంపించుచు) ఆ వాగుడు ఇక చాలించి నోరు మూసికొనుట మంచిది. మీ ఒక్కొక్క మాటకు ఒక్కొక్క అంచెగ నాకు రక్తపుపోటు హెచ్చి తెర్లుచున్నది! అతనిని పట్టు కొనుటకు నుపాయము నాలోచింపవలసినది పోయి ఏవేవో పుక్కిటి పురాణములు చెప్పుచున్నారు. అవన్నీ మన సైనికులను భయభీతులను చేయుటకు ఆ హిందూ కాఫిర్లు లేపుచున్న వట్టిపుకారులు. మీరు కూడ నమ్ముట ఆశ్చర్యముగనున్నది! మన సైనికులు ధైర్యము చేసి దండు వెడలి ముట్టడించినచో ఆబందారమంతయు నిట్టేబయట పడగలదు! లెండు, ఎట్లయినను ఆబడుగు బైరాగిని బంధించి తెండు....(విసురుగాలేచి కొలువు చాలించి వెళ్ళబోవును. తక్కినవారందరూ కూడ ఆతనితోపాటే లేచినిలుచుందురు.)

తెఱలో ప్రభూ! బందా బైరాగిని బంధించుటకు నియమింపబడిన మన సైన్యాధిపతులు రుస్తుందిల్‌ఖాన్‌గారి వద్దనుండి వచ్చిన వార్తాహరుడొకరు తమ దర్శనమునకై ద్వారముకడ వేచి యున్నాడు.

ఫరూక్షియరు: (ఆగి, అంతలోనే చల్లబడి, ఉత్సాహముతో) సర్దారులారా! ఆ వాలకమునుబట్టి ఆ బైరాగి బంధింపబడినట్లే యనిపించుచున్నదిసుమా!

అందరు: అందుకు సందేహమా! ప్రభూ! ఆ మిడతలంబొట్టు చిక్కినాడనుట ఖాయము! (అందరు మరల కూర్చుందురు).

ఫరూక్షియరు:(ఉత్సాహముగ)ఎవడురా! అక్కడ వెంటనే ప్రవేశపెట్టుము.

వార్తాహరుడు : (భయం భయముగ ప్రవేశించి తొట్రుపడుచు) ప్రభూ!
బందాబైరాగి........

అందరు:(చప్పట్లుచరచుచు)ఔనౌను, బంధింపబడినాడు, చాలసంతోషము!
శెభాష్ రుస్తుంఖాన్‌జీ శెభాష్! నీ ప్రతిజ్ఞ నిలబెట్టుకొంటివి.

ఫరూక్షియరు: మహమ్మదు మహాశయా! ఇంతటి శుభవార్త తెచ్చిన యీ
వార్తాహరుని గుఱ్ఱముపైనూరేగించి వంద వరహాల నిచ్చి పంపించ
వలసినదని కోశాధ్యక్షులకు కబురు చేయుడు.

వార్తాహరుడు: అయ్యా! అతడు....

ఫరూక్షియరు· ఔనౌను, సజీవముగ బంధింపబడినాడనియే గదా నీవు
చెప్పునది! చాల సంతోషము. (చప్పట్లు చఱచును)

వార్తాహరుడు : కాదు; ప్రభూ!

మహమ్మద్ : కానిచో నిర్జీవముగ బంధింపబడినాడన్నమాట! మఱింత
మహదానందము (మరల చప్పట్లు).

వార్తాహరుడు : అదికాదు; ప్రభూ!

మహమ్మద్ : ఏదికాదు; నీబొంద! వెంటనే వెళ్ళి ఆ బైరాగిని చూచుటకు
ప్రభువులు తహతహ పడుచున్నారనియు వెంటనే తీసుకొని
రావలసినదనియు పాదుషావారి యాజ్ఞగా దిల్‌ఖానుతో చెప్పుము
పొమ్ము!

వార్తాహరుడు : (నెత్తినోరు లబలబకొట్టుకొనుచు బిగ్గఱగా) ప్రభూ!
నా మొరఆలకింపుడు. ఆ బైరాగి తప్పించుకొని పారిపోయినాడు,

అందరు : (అందరు ఒకరి ముఖములొకరు చూచుచు గుండెలు బాదు కొనుచు) తప్పించుకొని పారిపోయినాడా !

ఫరూక్షియరు : (క్రోధముతో కంపించుచు) ఎవడురా అక్కడ, వీడిని తీసికొనిపోయి గాడిదపై నూరేగించి శూలము నగ్రుచ్చుడు.

వార్తాహరుడు : (భయభీతుడై) ప్రభూ ! మీ బానిసను. నాకేమియు తెలియదు. జరిగిన విషయము చెప్పనిచ్చి నన్ననుగ్రహించి విడిచి పెట్టుడు.

అందరు : ఒకరిముఖము లొకరు చూచుచు, వార్తాహరుని, పాదుషాను మార్చిమార్చి చూచుచుందురు).

మహమ్మద్ ; ప్రభూ ! మనము భ్రమలోబడి పట్టరాని ఉత్సాహములో పట్టించుకొనలేదు. అసలేమి జరిగినదో తెలిసికొనుట మంచిది గదా!

ఫరూక్షియరు ; (కొంచెము తమాయించుకొని, వెధవముఖము పెట్టుకొని) సరే, జరిగిన వృత్తాంతమును వివరింపుము.

వార్తాహరుడు ; చిత్తగింపుడు. మన సైన్యాధిపతి దిల్ ఖాన్ పెద్ద సైన్యముతో హఠాత్తుగ లోహగడను ముట్టడించెను. ఇటీవలి కాలమున యుద్ధములులేక పోవుటవలన ఆ బైరాగియు, అతని సైనికులును పూర్తిగా నేమఱియుండిరి. అకస్మాత్తుగ జరిగిన మన ముట్టడి వలన దిమ్మతిరిగిన, వారు తికమకబడుచు హాహాకారములతో నిటునటు పరుగెత్తుచుండిరి. ఆ బైరాగి అనుచరులలో గులాబ్ సింగు అనునాతడు అచ్చు ఆ బైరాగి పోలికలతో నుండును. ఆతడు ఆ బైరాగి దుస్తులను తాను ధరించి మన సైనికుల

నెదుర్కొనెను. తనవ్యూహము ప్రకారము ఆ బైరాగి సకుటుంబ ముగ కొంత సైన్యముతో నహాన్ పర్వత ప్రాంతములకు పలాయనము చిత్తగించెను.

ఫరూక్షియరు: (అసహనముగా, చేతులు త్రిప్పుచు) ఆమాట చెప్పుటకు నీకు సిగ్గు లేకపోయినను వినుటకు నాకైనను సిగ్గులేదనుకొనుచున్నావా? మఱి, అనకిలీ బైరాగి సంగతి........?

వార్తాహరుడు: ఆ నకిలీ బైరాగి గులాబ్‌సింగు మాత్రము దొరికెను... ఇది మన సైన్యాధిపతి రుస్తుందిల్‌ఖాన్‌గారు పంపిన సందేశము. సెలవు (భయం భయముగ నిష్క్రమించును).

ఫరూక్షియరు: (విసురుగా లేచి, కోపముతో చిందులు త్రొక్కుచు అందరు భయపడుచుండ) ఆ నకిలీ బైరాగిని చిత్రవధ చేయించుడు ఆ విధముగనైనను ముందు నాకు తాత్కాలికమగు నూరట కలిగింపుడు....ఎన్ని కష్టనష్టములు వచ్చిపడినను సాధ్యమైనంత త్వరలో ఆ కాఫిరును, అయసలు బైరాగిని పట్టిబంధించి తెచ్చి నా యెదుట చిత్రహింసలు పెట్టి హతమార్చవలయును. లేనిచో మీయందఱకు శిరచ్ఛేదము తప్పదు. (ఆవేశముగా నిష్క్రమించును.

(అందరు నిష్క్రమింతురు)

ఈ దీనస్థితిని చూచి వేనోర్వజాలను. నాయకుడు సరియైనవాడు కానప్పుడు ....—

కహాన్‌సింహుడు ; (వినోదసింహునితో) ఇట్టి పుల్లవిరుపు మాటలతో నిట్లు ఘర్షణ పడుటకంటె ఏదైనను నొక ఉపాయమాలోచించుట మంచిది. ఇంతకూ నీవేమి చేయదలచితివో చెప్పుము.

వినోదసింహుడు : నేనెట్లయినను శత్రువుల కనుగప్పి యీదిగ్బంధము నుండి తప్పించుకొని బయలుద్రొక్కుటకు ప్రయత్నింతును. బయట అనుమేఘముల పీద క్రొత్త సైన్యమును సమకూర్చుకొని వచ్చి, వెనుకపాటున ఈ దిగ్బంధమును ఛేదించి, శత్రువులను మట్టుబెట్టి మిమ్ములను కాపాడుకొనుటకు ప్రయత్నింతును. ఆపైన భగవదిచ్ఛ!

కహాన్‌సింహుడు ; చాలా గొప్ప యాలోచన ! వెంటనే పోయిరమ్ము.

వినోదసింహుడు ; (బందాకు నమస్కరించి) ప్రభూ! పోయివచ్చెదను. కొంత ఆవేశపడి మాటలాడినందులకు మన్నింపగలరు.

బందా: (వినోదసింహుని కౌగలించుకొని) దేశభక్తుడు, కార్యశూరుడునైన సైనికున కట్టి యావేశమొక గొప్పయలంకారము! అదృష్టమున్నచో తిరిగి త్వరలోనే కలిసికొందముగాక! పోయిరమ్ము!

వినోదసింహుడు; (శత్రువుల కనుగప్పి దూసుకొనిపోవుచుండును.)

ఒక మొగల్ సైనికుడు; ఎవరది?

వినోదసింహుడు; (ఆగి, వెనుదిరిగి, నిబ్బరముగ) నేనే,

మొగల్ సైనికుడు: (గద్దించుచు) నేనన్నచో నెవరివి?

వినోదసింహుడు: (తత్తరపడుచు) అబ్బ! నేనేనయ్యా! మిత్రుడను. (అనుచు ఉలుకులంకించుకొని మాయమైపోవును.)

మొగల్ సైనికుడు; అదుగో, శత్రువు పారిపోవుచున్నాడు. బహుశా బందా బైరాగి కావలెను. లెండు లెండు (అని యఱచును. కాపలా దారులు నిద్రలేచి హడావిడి చేయుదురు. కొంత సద్దుమణిగిన పిమ్మట)

అబ్దుల్ సమద్ ఖాన్: (సైన్యాధిపతి ప్రవేశించి) ఇక లాభము లేదు. కాలాస్వరము చేసినచో మనతలలు తెగిపడుట ఖాయము. ఇంతటితో నీదిగ్బంధమును చాలించి,తెగించి శత్రువుల స్థావరమున జొరబడి సామాన్య సైనికులను హతాహతమొనర్చి ఆ బందాబైరాగిని, ఆతని ముఖ్యులైన అనుచరులను మాత్రము బందీచేసి తొలుత లాహోరు పట్టణమునకు, పిమ్మట ఢిల్లీ నగరమునకు నూరేగింపుగా తీసుకొనిపోయి పాదుషాకు అప్పగింతముగాక!
(నిష్క్రమించును.)

(అందరూ నిష్క్రమింతురు)

# సప్తమ రంగము

కాలము. క్రీ.శ. 1716

సమయం—తెల్లవారుజామున నాల్గుగంటలు

స్థానము

ఢిల్లీలో కుతుబ్‌మీనార్ సమీపము

(ఫరూక్షియరు, అబ్దుల్ సమద్‌ఖాన్, మహమ్మద్ హమీద్‌ఖాన్ మొదలైన సర్దారులు కొలువుతీరియుందురు. ఒక ముస్లిం సైనికుడు గొలుసులతో బంధింపబడిన బందాను తీసికొనివచ్చి ఫరూక్షియరు సముఖమున నిలబెట్టును. అదిబందా మరణదేవతకు బలియగు దుర్ముహూర్తము. అతడు నిర్వికారుడై, ప్రశాంత రమణీయమూర్తియై పాదుషాను చూసియు చూడనట్లు నిబ్బరముగ నిలబడియుండును.)

ఫరూక్షియరు ; మహ్మద్ హమీద్‌ఖాన్ మహాశయా ! ఇక తతంగమును నడిపింప వలసినదిగా కోరుచున్నాను.

హమీద్ : బందా బహదూర్ ! నీవు యిస్లామును స్వీకరింపవలెనని పాదుషా వారి యాజ్ఞ !

బందా ; నా ప్రాణములు పోయిననుసరే, అది మాత్రము జరుగుటకల్ల.

హమీద్ : అట్లయిన నీ ప్రాణములు పోవుట ఖాయము. అయితే యెట్లయి నను నీ యమూల్యములైన ప్రాణములను కాపాడుకొనవలెనని పాపము పాదుషా వారి తహ తహ, కాని ప్రాణములు విడిచిపెట్ట వలెనని నీ కోరిక, ఎంత చిత్రము !

బందా ; మీ ఔదార్యమునకు ధన్యవాదములు.

హమీదు ; ఒక్క వ్రేటుతో నిన్ను తెగ నఱుకుట యొక పద్ధతి. రోజు కొక విధముగ చిత్ర హింసలు పెట్టి యింతలింతలుగ నఱికి పోగులు పెట్టుట మఱియొక పద్ధతి. ఈ రెండవది పాదుషా వారికి మిక్కిలి యిష్టమైన పద్ధతి. నీకేది యిష్టమో సెలవివ్వగలవా ?

బందా : మీరు పెట్టు హింసలన్నియు పాంచభౌతిక దేహమునకే గాని ఆత్మను చెనక జాలవు. ఆత్మ తెగదు, కాలదు, తడువదు, నశింపదు. అది శాశ్వతమైనది. ఇంతకు మించి నేనేమి చెప్ప గలను?

హమీదు ; దేహము, ఆత్మ వాటి తారతమ్యము—ఈ గొడవలు మాకు తెలియవు. మాకు తెలిసినది, చేయవలసినది ఒక్కటే, అది వీలైనచో నీకు యిస్లామును యిప్పించుట, కానిచో నీ దేహమును తొలగించుట. మీ శిఖులకు గుండె ధైర్యమెక్కువ. మరణమును నిబ్బరముగ నాహ్వానింతురు.

సమద్‌ఖాన్ ; (బందావైపు క్రూరముగా చూచుచు, ఆతనిని భయపెట్టుటకు) శిఖు పీరులలో తొలిబలి అర్జున్‌దేవ్ వధ. ఎఱ్ఱగాకాల్చిన యినుపరేకులపై కూర్చుండబెట్టి నిప్పుకణికలవలె మండుచున్న యిసుక మీద క్రుమ్మరించి గిలగిలకొట్టుకొనునట్లు చేసి ...

హమీదు ; మలిబలి తేజబహదూర్‌ది. ఒక్క వ్రేటుతో తలత్రెళ్ళి నెత్తురు ఎగజిమ్ముచుండ....

సమద్ ; ఆ పిమ్మట, నీ గురువు గోవిందసింహుని కొడుకుల జీవసమాధి. ఊపిరి యెగదట్టి ఉక్కిరిబిక్కిరి యగుచు గోడలలో క్రుంగ్గుచుండ....

హమీదు ; పిమ్మట సాక్షాత్తు గోవిందసింహుని హత్య....

సమద్; (బందావైపు చూచి వికటముగ) ఇప్పుడు బందా బహద్దరువారి చిత్రవధ ।

ఫరూక్షియరు; అయితే ఈతనిపని బట్టుటకుముందు మరొకరిపని బట్టవలసి యున్నది॥

అందరు; (ఉత్కంఠతో) ఎవరిది ప్రభూ.

ఫరూక్షియరు; (ఒక్కొక్కమాట క్రూరముగా వత్తివత్తి) ఈతడి... అయిదేండ్ల కొడుకు ....అజయసింగువధ (అని వికటాట్టహాసము చేయును).

బందా: (ఒక్కుమ్మడి విచలితుడై తనలో) ఈకిరాతకులు ఎంతటి పాప కృత్యమునకు ఒడిగట్టుచున్నారు. ఐదేండ్ల పసిబాలుని వధించుట యా॥ నాయిద్దరి కొడుకులలో నొకడు, అమరసింహుడు ఇటీవలనే అనారోగ్యమునకు గురియై మరణించినట్లు తెలిసినది. ఈమిగిలిన వంశాంకురమును గూడ పీరుపొట్టన బెట్టుకొనుచున్నారు ॥ (దుఃఖమును తమాయించుకొని, ఏదో జ్ఞప్తికి వచ్చినట్లు అభినయించి) ఆనాడు ఆబాలుడు "ఎట్లయినను అతనికి యీలేడికూనల ఉసురు తగలకపోవునాయేమి" అని పలికిన మాటలను నన్ను శపించుచున్నట్లు భావించితిని. అది యిప్పుడు నిజమగుచున్నది కాబోలు ! ఔగాక. విధిలిఖితమును ఎవ్వరు తప్పించగలరు ॥ కానున్నది కాకమానదు; అమాయకుడును, పసివాడును అయిన నా కుమారుడు సైతము నాతోపాటు....కాదు....నాకన్న మున్ను గ....నాకన్నుల యెదుట 'రాష్ట్రీయ ఇదంనమమ' అన్నట్లు తన

దేహపాతమొనర్చుట నాకు మహాగర్వకారణము. అట్టి మహదా నందముతో నేను పరమపదప్రాప్తిని యనుభవింతును గాక ;

ఫరూక్షియరు : (మార్చి మార్చి అటు బందాను ఇటుసర్దారులను చూచుచు తన దురూహకు తానే ముగ్ధిసిపోవుచు, ఉబలాటముగ, మెల్లగా సమద్‌ఖానుతో) ఈ దెబ్బతో నీతడు దిగివచ్చుట ఖాయము. తన కొడుకును దక్కించుకొనుటకైనను ఈతడు ఇస్లామును స్వీకరింపక తప్పదు. అట్లయిన నిద్దరు బ్రతికిపోగలరు. మనపంతము నెగ్గినట్లగును. అతని ముఖకవళికలు గమనింపుము. మార్పు కొట్టవచ్చినట్లు కాన్పించుచున్నది ;

సమద్ ; ఔను, ప్రభూ ; మీరు సెలవిచ్చినది నిజము. ఎన్నిబింకముల నైనను పోవచ్చును గాని కొడుకును చంపుకొనుటకు ... అది యట్లుండనిండు. ఒకవేళ నీతడు ఇస్లామును పుచ్చుకొనుట కంగీకరించినాడను కొందము గాక, అప్పుడు వీరిని విడిచిపెట్టుట ఖాయమేనా? ప్రభూ ?

ఫరూక్షియరు ; అది యిప్పుడే నిర్ధారించి చెప్పుటకుదరదు. వీరు ఈ రోజు యీ గండమును తప్పించుకొనగలరు. తుదినిర్ణయము పిమ్మట జరుగును.

సమద్ ; (తనలో) పాదుషాది యెంతటి ద్రోహబుద్ధి. ఒకసారి ఒక ఒప్పందమునకు వచ్చిన పిమ్మట ఎవరికిగాని దానికి కట్టుబడి యుండుట ధర్మము. కానిచో ప్రపంచమున విశ్వాసము నశించును గదా? ఇంతకు, నాత్రమగాని...మహానుభావుడగు యీ బందాసింగు మరణభయముతో స్వధర్మమునువీడి పరధర్మమును స్వీక

రించుననుట కల్ల—(ప్రతాళముగ) బాగున్నది ప్రభూ; బాగున్నది!

ఫరూక్షియరు ; ఎవడురా; అక్కడ. వెంటనే యీతని కొడుకును తీసికొని రండు.

ఒక సైనికుడు ; (కొద్దిసేపటి తరువాత) ప్రభూ ; ఇదుగో బందాసింహుని కొడుకు అజయసింగు (బందా యెదుట చతికిలబడవేయును. ఆ పసివాడు సర్వమునెఱిగిన శిశుయోగివలె నిబ్బరముగ కూర్చుండి తండ్రికి కూడ కర్తవ్యము నుపదేశించుచున్నాడో యన్నట్లు నిరీక్షించుచుండును.)

ఫరూక్షియరు ; బహదూర్‌మహాశయా : యిప్పటికైనను యిస్లామును పుచ్చుకొందువో లేదో చెప్పుము.

బందా · (వైరాగ్యముగ నవ్వి) అది యెప్పటికైననూ జరగని పని.

ఫరూక్షియరు ; అట్లయిన నీ కొడుకు చచ్చుట కచ్చితము. ఎవడురా, అక్కడ ! ఈ పిల్లవానిని ఒక్కవ్రేటుతో తెగవేయుడు.... ఆ ; వలదు, వలదు. తండ్రిచేతనే చంపించెదము గాక ; బందాసింగ్; ఆత్మకు నాశనము లేదనియు, నశించునది దేహముమాత్రమే యనియు ఏదో వేదాంతమును వల్లెవేసితివి గదా ; మరి దేహమును తొలగించినంతమాత్రమున వచ్చునష్టమేముండును గనుక, ఇదిగో నీ కొడుకును చంపవేయుము!

బందా ; ఈతడి జీవించుహక్కును తొలగించుటకు నేనెవరిని? అది నాచేత కాని పని.

ఫరూక్షియరు ; (కౄరముగ) ఎవడురా ; అక్కడ ; ఈ బాలుని యావలకు తీసికొనిపోయి యాతడికిన్ని,మాకును కనబడునట్లు ముక్కలు ముక్కలుగా నఱికి గుండెమాంసమును తెచ్చి యీ కాఫిరుచేత తినిపించుడు.

తలారి ; (పిల్లవానిని తెరలోనికి తీసికొనిపోవును. పిల్లవాడు హిందూధర్మకీజై ; అని నినదించిన చప్పుడు, నఱికినప్పుడు ధ్వనించు సవ్వడి వినిపించును. బందాసింహుడు అదిచూచి విచలితుడై విహ్వలకంఠస్వరముతో వైరాగ్యమును సూచించును. ఫరూక్షియరు ఇతర సర్దారులు వినోదమును నటింతురు.)

తలారి; (ప్రవేశించి, అందరూ వినోదము నటించుచుండ మాంసపుముద్దను బలవంతముగా బందా నోటిలో కూరును).

బందా; (మఱింత నిశ్చలముగ నిలబడియుండును).

ఫరూక్షియరు: బందాసింగ్! ఆఖరిసారిగా నడుగుచున్నాను. ఇప్పటికైనను యిస్లామును స్వీకరింతువా లేదా?

బందా: (మఱింత నిశ్చలముగ) నా అంతిమయాత్రా సమయమున నా ధర్మమే నాకు పాథేయము. ఇది నా ఆఖరిమాట.

ఫరూక్షియరు; (క్రోధముతో) ఎవడురా, అక్కడ, ఈతనిని తీసుకొనిపోయి చిత్రహింసలు పెట్టి వధించుడు. ఒక్కటి తరువాత నొకటిగ ముందు కనుగ్రుడ్లను పెఱికివేయుడు. పిమ్మట కాలుసేతులు నఱికివేయుడు ఎఱ్ఱగ కాల్చిన వృశ్చికాకారపు పటకాకత్తులతో గుచ్చి ముద్దలు ముద్దలుగ మాంసమును తోడివేయుడు. చివరికి కళేబరమును ఆతని యనుచరులకప్పగి కంపుడు. ఇది మా యాజ్ఞ. (అనుచరులతో నిష్క్రమించును)

బందా ; శిఖ్ఖుధర్మకీజై। హిందూధర్మకీజై। భారత్‌మాతాకీజై। (అని నినదించుచుండ సైనికులు బందాను తెఱలోనికి తీసికొని పోవుదురు).

సూత్రధారుడు ప్రవేశించి

రసహృదయులైన సామాజిక మహోదయులారా। ఇప్పటివఱకు మీరు 'ది సంస్కృత థియేటరు హైదరాబాదు' అను సంస్కృత నాటక ప్రయోగ సంస్థకు సంబంధిచిన నటులచేత ప్రదర్శింపబడిన, రాష్ట్రకవి డా॥ ఓగేటి అచ్యుతరామశాస్త్రిగారు రచించిన "బందా బైరాగి' అను చారిత్రక నాటకమును ఎంతో ఆసక్తితో తన్మయులై తిలకించుట మాకు మహదానంద కరముగనున్నది. మీకు మా హృదయపూర్వక ధన్యవాదములు. 'త్యాగేనైకేన అమృతత్వ మానసుః' అన్న ఉపనిషత్సూక్తి మన సంస్కృతికి ప్రాణసూత్రము. అట్టి త్యాగమునకు పరమోదాహరణము బందా బైరాగి జీవితము. అతనివంటి మహావీరపురుషుల జీవితములు మనకుదారిదీపములై వెలుగొందుగాక. అని మంగళాశాసనము చేయుచున్నాను స్వస్తిప్రజాభ్యః....లో'కాస్సమస్తాస్సుఖినోభవంతు.'

బందాబైరాగి నాటకము సమాప్తము.

## సూచన

సూత్రధారుడు నాటకమున ప్రథమ రంగము నుండియు అన్ని రంగము లందును తొలుత ప్రవేశించి ఆయా రంగముల ప్రారంభము నందు చెప్పబడిన స్థల, కాల, సమయ, కథాంశముల నిర్దేశము లను సామాజికులకు వివరించి నిష్క్రమించిన పిమ్మట రంగ ప్రదర్శనమును ప్రారంభింప వలయును. దానికి తగినట్లు రంగాలంకరణము లను సమకూర్చు కొనవలెను. ప్రథమరంగ ప్రారంభమున సూత్ర ధారుని పాత్ర యీక్రింది విధముగ నుండును :—

### ప్రథమరంగము

సూత్రధారుడు ప్రవేశించి

సహృదయులైన సామాజిక మహోదయులారా ! ఈ రోజు 'ది సంస్కృత థియేటరు, హైదరాబాద్' అను సంస్కృత నాటక ప్రయోగ సంస్థకు సంబంధించిన నటీనటులచేత ప్రదర్శింపబడ బోవుచున్న 'బందాబైరాగి' అను చారిత్రక నాటకమును తిలకించుటకు విచ్చేసిన మీయందరికీ నమస్సుమాంజలి సమర్పించుచు స్వాగతమును పలుకు చున్నాను.

ఈ నాటకమును రచించిన కవి సంస్కృత నాటక ప్రయోగోద్ధారక, నటరాజనందన, ఆశ్చర్యతుశలవక్త, మహో పాధ్యాయ, భాగ్యనగర భారతి, రాష్ట్రకవి ఇత్యాది బిరుద విభ్రాజమాను లైన డాక్టర్ ఓగేటి అచ్యుతరామశాస్త్రిగారు, వీరు సంస్కృతాంధ్రాంగ్ల హిందీ భాషా ప్రవీణులు. ఈనాల్గు భాషలలోను బహుగ్రంథకర్తలు. మహావక్తలు. ఒకవైపున 'సంస్కృతథియేటరు' అను సంస్థకు సంస్థా

వక, వ్యవస్థాపక అధ్యక్షులై సంస్కృత నాటక ప్రదర్శనల ద్వారాను, మరొకవైపున 'సంస్కృత భారతీ' అను పత్రికకు సంస్థాపక వ్యవస్థాపక సంపాదకులై సంస్కృతపత్రకారితారంగము ద్వారాను ఇంకొకవైపున 'స్నేహబంధనమ్' 'బందాబైరాగి' మొదలైన సంస్కృత నాటకకావ్యములను రచించుట ద్వారాను, ఆంధ్రప్రదేశమున సంస్కృత భాషా వ్యాప్తికి అనితరసాధ్యమైన కృషిచేసిన, చేయుచున్న విశిష్టవ్యక్తి. అట్టి వీరు ఈ 'బందాబైరాగి' చారిత్రక నాటకమును సంస్కృతాంధ్ర భాషలు రెండింటిలోను వెలయించి రంగస్థలమున ప్రదర్శించుటకు మాకు ప్రసాదించుట మహద్భాగ్యము. ఇప్పుడిక్కడ తెలుగు నాటకము ప్రదర్శింపబడబోవు చున్నది. ఇందలి ప్రథమరంగము స్థల కాల సమయ, కథాంశ నిర్దేశములివి.

కాలము క్రీ.శ. 1686, సమయము ఉదయం పదిగంటలు, స్థానము; కాశ్మీరము నందలి పూంచ్ జిల్లాలోని రాజౌరి గ్రామమునకు దాపునగల అరణ్యము. ధనుర్బాణములను ధరించి లేడిని వెంబడించుచు రాజాలక్ష్మణదేవు ప్రవేశము. వయస్సు ఇరువది సంవత్సరములుండును. అడుగో లక్ష్మణదేవు ప్రవేశించుచున్నాడు. ఇక నేను నిష్క్రమింతును.

(సూత్రధారుడు నిష్క్రమించును)

తరువాతి రంగములందు సైతము ఇట్లే సూత్రధారుడు ప్రవేశించి ఆయా రంగముల స్థల కాల సమయ చారిత్రకాంశములను మాత్రము నిర్దేశించి నిష్క్రమించుచుండును.

—

రాష్ట్రకవి

# డాక్టర్ ఓగేటి అచ్యుతరామశాస్త్రిగారి

## ముద్రిత సాహిత్య సంపద

## తెలుగు

1. శంకరాచార్య—పద్యకృతి 1958
2. బందాబైరాగి—చారిత్రికరూపకము. ప్రథమముద్రణ 1959. ద్వితీయముద్రణ 1992
3. హిమకిరీటిని—ఆధ్యాత్మిక జాతీయగేయకావ్యము ప్రథమ ముద్రణ 1981, ద్వితీయ ముద్రణ—1988
4. హైదరాబాదు నగర బిర్లామందిర వేంకటేశ్వరశతకము—పద్యకృతి —1987
5. శ్రీబాసర సరస్వతీక్షేత్రము—పద్యకృతి—1990
6. హైదరాబాదునగర తెలుగు భాషాసాహిత్య వికాసచరిత్ర—క్రీ.శ 1518—1956 మధ్యకాలములో హైదరాబాదు నగరమున వికసించిన తెలుగుభాషా సాహిత్యచరిత్ర—1985
7. ఓగేటి వ్యాసపీఠి—అపూర్వములైన వివిధ పరిశోధన, విమర్శ నాత్మకసాహిత్య వ్యాసముల సంపుటి—1986.
8. ఎఱ్ఱన అరణ్యపర్వశేషము—ఉ.వి.వి.నుండి 1983లో పిహెచ్ డి పట్టాపొందిన సిద్ధాంతగ్రంథము—1989.

## సంస్కృతము

9. స్నేహబంధనమ్—సాంఘిక ఏకాంకరూపకము. 1978

10. అచ్యుతగీత—గేయకావ్యము—1990.

11. హిందూమతము—గద్యపుస్తకము—1990.

12. స్వామీవివేకానంద కవితావైభవమ్—వ్యాఖ్యానగ్రంథము. వివేకానందుడు వ్రాసిన 26 సంస్కృత శ్లోకములకు మల్లినాథసూరి పద్ధతిలో వ్రాసిన అపూర్వ తెలుగు వ్యాఖ్యానగ్రంథము. వారు వ్రాసిన 12 ఆంగ్లకవితలకు గూడా వ్యాఖ్యానము వ్రాయబడినది —1983

13. సంస్కృతనాటక ప్రయోగరంగము—క్రీ.శ.1874—1975 మధ్య కాలములో ఆంధ్రప్రదేశ్‌లో ప్రవర్తిల్లిన వంద సంవత్సరముల సంస్కృత నాటకప్రయోగరంగచరిత్ర—1975

## ఇంగ్లీషు

14. *Lady Of TheLake*—ఆంగ్లభాషలో వ్రాసిన కొన్ని తెలుగు సంస్కృత జానపద కథల సంపుటి—1990

## హింది

15. భారతీయ చరిత్రసత్యాన్వేషణ—హిందీనుండి తెలుగునకు అనువదింపబడిన కొన్ని వ్యాసముల సంపుటి—1983

16. మహారాజా సర్‌కిషన్ ప్రసాద్ బహాదుర్—'శాద్' హిందీలోనే వ్రాసిన జీవితచరిత్ర—1994